# మన వైదేశిక విధానము

*

CHECKED-75

రచన:

ఆచార్య శ్రీ మామిడిపూడి వేంకటరంగయ్య M. A.

తెలుగు విద్యార్థి ప్రచురణలు
మచిలీపట్నం.

# మా మాట

మన వైదేశిక విధానమును గురించిన సంపూర్ణ పరిజ్ఞానము మన వారిలో బహుసంఖ్యాకులకు అరుదు. విశేషించి విద్యార్థులకిది జటిల సమస్య. మన మనుసరిస్తున్న తాటస్థ్య విధానముపై ఈ మధ్య అనేక మందికి అనేక సందేహములు పొటమరించినవి. చివరికి ఇందు మనము అకృతార్థులమైతిమని ప్రచారముకూడ మొదలైనది. ఈ స్థితిలో మన వైదేశిక విధానమును గురించి మనము తెలిసికొనవలసిన దెంతేని వున్నది. నిర్వచనము మొదలు ప్రస్తుతము మన మనుసరిస్తున్న విధానములో చేసికొనదగిన మార్పులు వరకు సమగ్ర చర్చ గావించి, సుబోధకముగా వివరించిన "ఆచార్యజీ" కృషి తెలుగులో వైదేశిక విధానమును గురించిన గ్రంథంలేని లోటును తీర్చగలదని ఆశిస్తున్నాము.

మా తొలిపుష్పాన్ని ఆఘ్రాణించి, ఆదరించిన సహృదయతతి మలి పుష్పాన్ని సైతం అట్లే సమాదరించి బహు పుష్ప ప్రాభవానికి దోహదకారులు కాగలరని విశ్వశిస్తున్నాము. తొలి పుష్ప వికాస కారకులు "ఆచార్యజీ" మలి పుష్పానికీ, వికసించనున్న మరెన్నో పుష్పాలకు కారకులు కావటం మా అదృష్టం. తీర్చజాలని ఈ ఋణానికి వారిచే వికసింపబడిన ఈ పుష్పాలను మాలగా కూర్చి భక్తి ప్రపత్తులతో అంజలి ఘటించడ మొక్కటి మాత్రమే మా పేద హృదయానికి చేతనైన పని.

ఇట్లు
పచురణ శాఖాధిపతి
తెలుగు విద్యార్థి ప్రచురణలు

# విషయసూచిక

# మన వైదేశికవిధానము



## I

### నిర్వచనము

ప్రపంచములో మనదేశముతోపాటు సుమారు నూరు స్వతంత్రరాజ్యములు ఉన్నవి. ఈ రాజ్యములపట్ల మనము వహించు వైఖరికిన్ని, ఆ వైఖరియొక్క బాహ్య స్వరూపమునకున్ను, దాని మూలమున మనము వాటితో ఏర్పరచుకొను సంబంధములకును, మన వైదేశికవిధానమని పేరు. ఈ వైఖరి కొన్ని దేశములపట్ల మితృత్వరూపమును, కొన్నిటిపట్ల శతృత్వరూపమును, లేదా అన్నిటిపట్ల మిత్రత్వరూపమును ధరించవచ్చును. దీనిమూలమున రాజకీయ సంబంధములు, వర్తక వ్యాపారాది ఆర్థిక సంబంధములు, వైజ్ఞానిక సంబంధములు ఏర్పడవచ్చును. వీటి అన్నిటినిగురించి మనము తెలుసుకొనినయెడల మన వైదేశిక విధానమును తెలుసుకొనినవార మగుచున్నాము.

ఇదిగాక, ఈ సందర్భములో గమనించవలసిన విషయము ఇంకొకటికలదు. ప్రపంచములో ఏదో ఒక రాజ్యమునకు మాత్రమే సంబంధించక అనేక రాజ్యములకుగాని ప్రపంచమునకంతకుగాని సంబంధించిన అంతర్జాతీయ సమస్య లనేక

ములున్నవి. వీటిలో కొన్ని కొత్తవి, కొన్ని పాతవి. కొన్ని అప్పటికప్పుడు ఉత్పన్నము లగుచుండునవి. రాజ్యములమధ్య వివాదములు సంభవించినప్పుడు వాటిని పరిష్కరించు కొనుటకు అనాగరిక యుద్ధ మొక ప్రధాన సాధనముగ నున్నది. ప్రస్తుతము అణ్వస్త్రముల మూలమున ఏర్పడిన పరిస్థితులలో ఈ సాధనము నుపయోగించుట ప్రాజ్ఞతయా? లాభకరమా? లేక దీనిని పూర్తిగ విసర్జించి, సంప్రదింపుల ద్వారా వివాదములను పరిష్కరించుకొనుట ఉత్తమమార్గము కాదా? అన్న ప్రశ్న, దీనికియ్యతగిన సమాధానము, దీనికి సంబంధించిన ఏర్పాటులు ఏదో ఒక రాజ్యమునకుమాత్రమే సంబంధించిన విషయముకాదు. ఇది ప్రపంచమునకంతకు సంబంధించినది. నిరాయుధీకరణ సమస్యకూడ ఇట్టిదే. ఇది కూడ ప్రపంచములోని అన్ని దేశములకు సంబంధించినది. అందుచేత అంతర్జాతీయ సమస్యలలో ఒకటి అగుచున్నది. ప్రపంచమందు స్వాతంత్ర్యములేని వలస దేశములు వుండవల సినదేనా? వలస విధానము (సామ్రాజ్య విధానము) పూర్తిగ అంతరించి, అన్ని దేశములకు స్వాతంత్ర్యము లభించుట శ్రేయోదాయకము కాదా? అన్న విషయము ప్రపంచమున కంతకు సంబంధించినది. ప్రపంచములో ఆధునిక కాలమున ఉత్పన్నమైన యుద్ధములలో అనేకములకు వలస విధానము ప్రధాన కారణమగుటచేత ఈ విధానము నశించిన పక్షమున యుద్ధముల సంఖ్యయు వాటి తీవ్రతయు చాలవరకు తగ్గిపోవును. అందుచేత వలస విధాన సమస్య ప్రపంచమునకంతకు సంబం ధించిన అంతర్జాతీయ సమస్య అగుచున్నది. జాతినిబట్టి

మానవకోటిమధ్యన ఇటీవలకాలములో ఏర్పడిన వైషమ్యము కూడ ఇట్టి సమస్యయే. శ్వేతజాతులవారు ఉత్కృష్టులనియు, రంగుజాతులవారు నికృష్టులనియు అనుకొనుట మూలమున ప్రస్తుతము ప్రపంచములో ఉద్రిక్తపరిస్థితులు ఏర్పడియున్నవి. ముఖ్యముగ ఆఫ్రికాఖండములో దీని ప్రభావము అపరిమిత ముగ నున్నది. ఇదికూడ ప్రపంచ సమస్యలలో ఒకటి. ఉదాహరణమునకై ఇచ్చట కొన్ని ప్రపంచ సమస్యలు మాత్రమే పేర్కొనబడినను ఈలాటి సమస్య లనేకములున్న వని గ్రహించుట అవసరము

ఇట్టి ప్రపంచ సమస్యలపట్ల మనమువహించు వైఖరియు, దాని బాహ్య స్వరూపమును, దాని మూలమున ఇతర దేశ ములతో మనము ఏర్పరచుకొను సంబంధములును, మన వైదేశిక విధానములో ఒక అంతర్భాగముగ ఉన్నవి. మనము అంతర్జాతీయ వివాద పరిష్కారమునకు యుద్ధసాధన మును అభిమానించుచున్నామా? లేక శాంతితో కూడిన సంప్రతింపులను అభిమానించుచున్నామా? నిరాయుధీకరణ సమస్య, వలస విధాన సమస్య, జాతి సమస్య మొదలైన ప్రపంచసమస్యలపట్ల మనము అనుసరించుచుండు వైఖరి ఎట్టిది? అన్న ప్రశ్నలకు మనము సమాధానము చెప్పగలిగిన యెడల మన వైదేశిక విధానమెట్టిదో తెలుసుకొన్నవార మగుదుము.

దీనినిబట్టి "వైదేశిక విధానము" అన్న మాటకు నిర్వచనము, స్థూలముగ దాని అర్థము మనకు స్పష్టమగు

చున్నది. ప్రపంచములోని రాజ్యముల పట్లను, ప్రపంచ మంతకు సంబంధించిన సమస్యలపట్లను మనము వహించు చుండు వైఖరియే మన వైదేశిక విధానమని స్థూలముగ నిర్వచించవచ్చును.

## ఒక మూలసూత్రము

వైదేశిక విధానమంతయు ఒక మూలసూత్రముపై ఆధారపడియున్నదని చెప్పవచ్చును. ఈ సూత్రము మన ఒక దేశముపట్లనేగాక, అన్ని దేశములపట్ల వర్తించునట్టిది.

ప్రతిదేశము దాని భద్రతకు తమ శ్రేయస్సుకు ఏ విధానము అనుకూలముగా వుండునో ఆ వైదేశికవిధానమును అనుసరించడము ధర్మము. తన్నుమాలినధర్మము ఎన్నటికిని అనుసరణయోగ్యము కాజాలదు. మన దేశమును విస్మరించి పరోపకారము చేయడమునకుగాని ప్రపంచమును మరామత్తు చేయడమునకుగాని ప్రయత్నించడము నేల విడిచి సాము చేయడమువంటిది. మన భద్రతను కాపాడుకొని, మన శ్రేయస్సును అభివృద్ధిచేసుకొన్నప్పుడే మనము ఇతర దేశము లకు సహాయము చేయగల స్థితిలోనికి రాగలుగుతాము. మనము అనుసరించు వైదేశిక విధానము మన భద్రతను, శ్రేయస్సును అభివృద్ధిచేయగలదిగ ఉండవలెను.

ఈ విషయములో ఒక దేశముయొక్క పరిస్థితులకును మరియొక దేశముయొక్క పరిస్థితులకును భేదము లుండుటచేత

అవి అనుసరించదగిన వైదేశిక విధానములలో భేదముండుట తప్పదు. ఇతరులయొక్క సైనికసహాయము లేక తమ భద్రతను రక్షించుకొనగలదేశములు కొన్ని గలవు; మరికొన్ని అట్టిస్థితిలో లేనికారణమున అవి ఇతర దేశములతో సైనిక ఒడంబడికలు చేసుకొని తమ భద్రతను కాపాడుకొనుచున్నవి. విస్తీర్ణమందును జనసంఖ్యయందును చిన్నవిగనుండు దేశములేగాక పెద్దవిగనుండునవికూడ కొన్ని ఇట్టి ఒడంబడికలు చేసుకొనియుండుట కిదియే కారణము. కొన్ని దేశముల మధ్య తరతరములుగ వైరమేర్పడియున్నది. మరికొన్నిటి మధ్య - అవి ఇరుగుపొరుగు దేశములైనను - వైరమనునది లేదు. విరోధ మేర్పడినపుడు దానిని సాధించుకొనుటలో ఒక దేశము మరికొన్ని ఇతర దేశముల సహాయము సంపాదించు కొనుటయు ఇంకొక దేశము తదితర దేశముల సహాయము సంపాదించుకొనుటయు సహజము. ఒక్కొక్కప్పుడు మత భేదములబట్టియు, అనుసరించు రాజకీయ ఆర్థిక సిద్ధాంత భేదములబట్టియు మిత్రత్వ శత్రుత్వములు ఏర్పడుచుండును.

దీనినిబట్టి మనము ఒక సత్యమును గ్రహించవలసి యున్నది. అన్ని దేశముల వైదేశిక విధానమునకు మూల సూత్ర మొక్కటే ఆధారమైనను ఆ సూత్రమును ఆచరణ యోగ్యము చేసుకొనుటలో ఒక దేశముయొక్క వైదేశిక విధానమునకును మరియొక దానియొక్క విధానమునకును భేద మేర్పడుట తప్పదనుటయే ఈ సత్యము. మన మనుసరించు విధానమే ఉత్కృష్ట మైనదనియు, తక్కిన దేశములనుసరించు

నది అట్టిది కాదనియు భావించుట తగదు. ఏదేశముయొక్క శ్రేయో భద్రతలకు అనుకూలించు విధానమును ఆదేశము అనుసరించ వలసియున్నది.

## మనది తాటస్థ్య విధానము

గత పన్రెండు సంవత్సరములనుండి – అనగా మనకు స్వారాజ్యము లభించినప్పటినుండి – మన మనుసరించుచుండు వైదేశిక విధానమునకు "తాటస్థ్య విధాన" మన్న పేరు వాడుకలోనికి వచ్చియున్నది. "తాటస్థ్య విధాన" మనగా ఏమిటి? అది మన భద్రతకు శ్రేయోభివృద్ధికి ఎంతవరకు ఏ విధముగ తోడ్పడెను? అన్న ప్రశ్నలకు మనము సమాధానము చెప్పుకొనుట అవసరము

రెండవ ప్రపంచయుద్ధము ముగిసినతర్వాత (1946) ఒకటి రెండు సంవత్సరములలో ప్రపంచమందు ఒక విధమైన గొప్ప మార్పు, దాని ఫలితముగ ఒక గొప్ప ప్రపంచ సమస్య ఏర్పడెను. యుద్ధ ఫలితముగ రెండు అగ్రరాజ్యాలు మాత్రమే – అమెరికా– సోవియట్ రషియాలు – మిగిలి పోయినవి. అంతకుపూర్వము అగ్రరాజ్యములుగ పరిగణింప బడుచుండిన బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ, జర్మనీ, జపానులు పూర్తిగ చితికిపోయినవి. చైనా యిండియాలు అగ్రరాజ్యములగుటకు కావలసిన అర్హతను సంపాదించి యుండలేదు. ఇవిగాక ఈ మిగిలిపోయిన రెండు అగ్రరాజ్యముల మధ్య పెద్ద వైరము ఏర్పడెను. ఇది ప్రపంచయుద్ధమునకు దారి

తీయునట్టిదిగ పరిణమించి ఒక ప్రపంచ సమస్యగ రూపొం దెను. అది మొదలు ఇప్పటివరకు ప్రపంచ సమస్యలన్నిటిలో ఇది అగ్రస్థానము వహించినదని చెప్పుట అతిశయోక్తి కాదు.

ఈ వైరము అంతర్జాతీయ రాజకీయము లన్నిటిపైన అత్యంత ప్రభావముకలది అయ్యెను. ఇతర దేశములన్నియు దీనిని దృష్టిలో ఉంచుకొని వాటి వైదేశిక విధానమును రూపొందించుకొనవలసి వచ్చెను. వైరమును సాధించు కొనుటలోను, దానిమూలముగ ఏర్పడిన ప్రచ్ఛన్న యుద్ధ మును సాగించుకొనుటలోను, అగ్రరాజ్యములు రెండూ ఇతర రాజ్యములను తమ తమ పక్షములోనికి చేర్చుకొనుటకై విశ్వప్రయత్నము చేయసాగినవి. వాటి వాటి భద్రతను శ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని కొన్ని దేశములు ఐచ్ఛిక ముగను, కొన్ని నిర్బంధముగను సోవియట్ రష్యా పక్షము నను, మరికొన్ని అమెరికా పక్షములోను చేరిపోయినవి. ఒక యూగోస్లోవియా మినహాగా కమ్యూనిష్టు ప్రభుత్వములు ఏర్పడ్డ దేశములన్నియు రషియా కూటమిలో సభ్యత్వము వహించినవి. కమ్యూనిష్టేతర దేశములలో అమెరికా ఖండములోని కెనడా, దక్షిణ అమెరికాలోని ఇరవై రాజ్య ములు, పశ్చిమ యూరపులోని బ్రిటన్ మొదలైన రాజ్య ములు, గ్రీసు, టర్కీ, ఇరాన్, పాకిస్తాన్, థైలాండు, దక్షిణ వియట్నాం, ఫిలిప్పైన్సు, దక్షిణ కొరియా, జపాన్, ఆస్ట్రేలియా, న్యూజిలెండులు అమెరికా కూటమిలో సభ్య త్వము వహించినవి.

ఏవో కొన్ని దేశములుమాత్రము ఏ కూటమిలోను చేరక తటస్థముగా ఉండిపోయినవి. ఇట్టి దేశములలో ప్రధానమైనది మనదేశము. అందుచేత మన ఋూపండెంను సంవత్సరములనుండి అనుసరించుచుండు వైదేశిక విధానమునకు తాటస్థ్య విధానమనుపేరు ప్రచారములోనికి వచ్చెను. మనతోబాటు ఈ విధానమును అనుసరించినవాటిలో ఇండొనీషియా, బర్మా, సింహళము, ఈజిప్టు, యుగోస్లోవియాలు ప్రధానములైనవి.

## తాటస్థ్య విధాన ప్రయోజనములు

మన భద్రతకును శ్రేయోభివృద్ధికిని అమెరికా సోవియట్ కూటములలో దేనియందుకూడ మనము చేరకుండుటయు, తాటస్థ్య విధానము అనుసరించుటయు అనుకూల సాధనమని మనము భావించుటకు కారణము లనేకములు కలవు.

(1) ప్రపంచమందు మనకెవరైనను శత్రువు లున్నప్పుడు, ఆశత్రువును మనము ఒంటరిగా ఎదుర్కొనలేనప్పుడు మనము ఏదో ఒక పక్షమున (కూటమిలో) చేరడము దాని సహాయమును సంపాదించడము అవసరమగుచున్నది. కాని ఇటీవలివరకు ఒకసారి పాకిస్తాన్ తప్ప మరి ఏదేశముకూడ మన పట్ల శత్రుత్వము వహించకుండిన కారణమున ఇట్టి అవసరము మనకు కలుగలేదు. చైనా మూలముగ ఏషియా ఖండము లోని దక్షిణదేశము లన్నిటికి ప్రమాదము తప్పక సంభ

విస్తుందని అమెరికావారు, అమెరికా కూటమిలో చేరినవారు హెచ్చరించుచుండినమాట వాస్తవమే. కాని ఇందులో సత్యములేదనియు, ఇది దుష్ప్రచారమనియు మనము భావించుచు వచ్చినాము ఇంతేకాకుండా, చైనాలో కమ్యూనిస్టు ప్రభుత్వము స్థాపింపబడి నప్పటినుండి (1949) దానిపట్ల అత్యంత స్నేహభావముతో ప్రవర్తిస్తు వచ్చినాము. కమ్యూనిస్టేతర దేశాలేవియు దానిని గుర్తించుటకు పూర్వమే మనము ప్రప్రథమముగ దానిని గుర్తించినాము. ఐక్యరాజ్య సమితిలో దానికి ప్రాతినిధ్యము ఉండవలెనని వాదించి, పదే పదే అందుకై కావలసిన ప్రయత్నములను చేసినాము. 1950 లో టిబెట్టుపై అది దాడిచేసినప్పుడు అది ధర్మ విరుద్ధమని చారిత్రిక సంప్రదాయవిరుద్ధమని మనము మొట్టమొదట చేసిన వాదమును ఉపసంహరించుకొని, టిబెట్టుపై రాజకీయాధికారము చైనావారిదే అని అంగీకరించినాము. బాండుంగు సమావేశములో చైనాకు ఆహ్వానము పంపించడములో ప్రధాన పాత్ర వహించినాము. చైనాయొక్క మాటలను పూర్తిగ విశ్వసించి పంచశీల సిద్ధాంతమును ఆధారముగ జేసుకొని దానితో ఒక ఒడంబడికను చేసుకొన్నాము. ఒకటేమిటి — అవకాశము లభించినప్పుడల్లా, చైనాపట్ల మనము సుహృద్భావం ప్రకటించినాము. చైనానుండివచ్చిన అనేక సాంస్కృతిక ప్రాతినిధ్యవర్గములకు అత్యంతముగ స్వాగతము సమర్పించినాము. మన ప్రాతినిధ్యవర్గము లనేకములను ఆ దేశమునకు పంపించడమే కాకుండా ఆ ఆ దేశములో కమ్యూనిస్టు ప్రభుత్వము మూలముగ ఏర్పడ్డ

పరిస్థితులు, జరుగుచున్న మార్పులు ప్రశంసా పాత్రములని అనుసరణీయములని ప్రచారము చేసినాము. వారినుండి మనము నేర్చుకొనవలసిన గుణపాఠములు లెక్కలేనివని చెప్పడమునకు పూనుకొన్నాము. "చైనా మన పొరుగు దేశము దానికి లక్షలాది సైన్యం ఉన్నది. రష్యా దానికి అండగా నిలబడి ఉన్నది. అలాటిదేశం మన శత్రువర్గంలో చేరకుండా, మన మిత్రవర్గంలో చేరి ఉండడం ఎంతో అవసరం," అని, పరిపరి విధములుగా మనము చైనావారి యెడల మిత్రత్వంతో ప్రవర్తించాము అందుచేత పాకిస్తాన్ తప్ప మరి ఏ దేశంకూడా మనపట్ల విరోధం వహించదన్న ధైర్యంతోను విశ్వాసంతోను మనం ప్రవర్తిస్తూ వచ్చాము. అమెరికావలె మనముకూడా కమ్యూనిష్టు విధానాన్ని నిరసించి ప్రజాస్వామ్య విధానాన్ని అనుసరించేవారమైనా, అమెరికా కూటములో చేరడంవల్ల అనవసరముగా చైనా శత్రుత్వానికి గురి కాగలమన్న భావముతో ఆ కూటములో చేరడమునకు ఇష్టపడకపొయ్యాము. పాకిస్తాన్ మనపట్ల శత్రుత్వం వహించినా, మనది పాకిస్తాన్‌కంటె పెద్దదేశం కావడంచేతను, ఏకూటముయొక్క సహాయము లేకుండా దానిని ఎదుర్కొనడము సాధ్యమని తాటస్థ్య విధానమునే మనము అనుసరించాము.

(2) మనము క్రొత్తగా స్వాతంత్ర్యమును స్వారాజ్యమును సంపాదించుకొన్నవారము వీటికి ఏలాటి భంగము కలుగకూడదనేది మన నిశ్చయము. ఏదైనా ఒక కూటమిలో

చేరడమనగా, స్వాతంత్ర్యమును కొంతవరకు కోల్పోవడ మవుతుంది. మన వ్యవహారముల నన్నిటిని పూర్తిగ మన ఇష్టానుసారము జరుపుకొనుటయేగదా స్వాతంత్ర్యము. కాని ఏదో ఒక కూటములో మనము చేరినపక్షమున ఆ కూటము యొక్క ఆశయములకు కార్యక్రమములకు మనము బద్ధులమై దాని నిర్ణయముల ననుసరించి మనము మన వ్యవహారములను సరిదిద్దుకొనవలసి వస్తుంది. అంతర్జాతీయ రంగములో ఉత్పన్నమగు వాద ప్రతివాదములలో ఏవి సమర్థనీయములో ఏవి కావో బహిరంగముగ చెప్పుటకు కావలసిన స్వాతంత్ర్యమును మనము కోల్పోవుట తప్పదు. ఈ విషయముల నన్నిటిని దృష్టిలో ఉంచుకొని తాటస్థ్య విధానమే మనకు అనుసరణీయమని భావించాము. మన భావ స్వాతంత్ర్యమునకు అదియే పరమ సాధనము.

(3) ఏదైనా ఒక కూటములో చేరడమనగా దానికి అధినేతలుగా ఉండే దేశములతో సైనిక ఒడంబడికలు చేసుకొని, అవసరమైనప్పుడు వాటి సైన్యములకు, విమానాది పరికరములకు, అణ్వస్త్రములకు మన దేశములో స్థావరములను నెలకొల్పి, పరాయి సైన్యములకు ప్రవేశము కల్పించడమే. అమెరికా కూటములో చేరిన బ్రిటన్, ఫ్రాన్సు, పశ్చిమ జర్మని, ఇటలీ, గ్రీసు, టర్కీ మొదలైన దేశములలో అమెరికావారి సైనిక శిబిరము లనేకములు ఏర్పడియున్నవి. ఇదే విధముగ సోవియట్ కూటములో చేరిన పోలెండు, తూర్పు జర్మని, జెకోస్లోవేకియా, హంగేరీ మొదలైన

దేశములందు రష్యావారి సైనిక శిబిరము లనేకములున్నవి. బ్రిటిష్ పరిపాలన కాలములో పరాయి సేనలద్వారా మనకు కలిగిన ప్రమాదము ఇంతింతకాదు. పరాయి సేనలు ఒక పర్యాయము ప్రవేశించినయెడల వాటిని దేశమునుండి తొలగించుట కష్టసాధ్యము. చావు బ్రతుకులకై మనము శత్రువులతో పోరాడవలసి వచ్చినప్పుడు విధిలేక తాత్కాలికముగ యిలాటి సైనిక ఒడంబడికలు చేసుకొనవచ్చునేమో గాని, సాధారణ పరిస్థితులలో ఇది వాంఛనీయము కాజాలదు. ఇట్టి ప్రమాదమునుండి తప్పించుకొనుటకు తాటస్థ్య విధానమును అనుసరించుటయే మంచిది.

(4) ఆర్థికముగ మనది ఇప్పటికికూడ వెనుకబడిన దేశమని చెప్పక తప్పదు. తిండి, గుడ్డ మొదలైన కనీస అవసరములుకూడ సంపాదించుకొను శక్తి లేక నూటికి తొంభై మంది జీవితమును గడుపుచున్నారు. దారిద్ర్యము నిర్మూలముగావించి ప్రజల ఆదాయమును జీవన ప్రమాణమును పెంచగలిగినప్పుడే మనము సంపాదించిన స్వరాజ్యము సార్థకము కాగలదనియు, లేనియెడల ఇది మిథ్యా స్వరాజ్యమనియు విశ్వసించి, దీని కనుగుణముగ పంచవర్ష ప్రణాళికలను తయారుచేసి, వ్యవసాయము, పరిశ్రమలు, రవాణా సౌకర్యములు మొదలైనవాటిని అభివృద్ధిచేసుకొను మహా ప్రయత్నములో మనము ఉన్నాము. కాని ఇది సఫలమగుటకు కావలసిన మూలద్రవ్యము (పెట్టుబడి ద్రవ్యము) గాని సాంకేతికజ్ఞానముగాని మనకు చాలదు. వీటిని విదేశముల

నుండి మనము సంపాదించవలసి ఉన్నది. ఏ దేశమందు ఇది మనకు లభించునో ఆ దేశమునుండి వీటిని సంపాదించగల అవకాశము మనకు ఉండుట ఎంతో అవసరము, లాభకారి. ఇట్టిస్థితిలో మనము ప్రపంచములో ప్రస్తుతముండు రెండు కూటములలో ఏదియో ఒకదానియందు చేరిపోయినయెడల అందులోని దేశములనుండియే మనకు కావలసిన మూల ధనమును, సాంకేతిక జ్ఞానమును సంపాదించవలసి ఉండును. రెండవకూటమిలోని దేశములనుండి మన కెట్టి సహాయము లభించదు. ఒక కూటమును మాత్రమే నమ్ముకొని ప్రవర్తిం చుకొనుట ప్రాజ్ఞత కాజాలదు. రెండవకూటములోని దేశ ములనుండి సహాయము సంపాదించుకొనుటకు దేనియందును పక్షపాతము లేక, తాటస్థ్య విధానమును అనుసరించుటయే ఉత్తమ మార్గము. ఇందుచేతనే ఇటీవల కొన్ని సంవత్సర ములనుండి రెండు కూటములవారు యథోచితముగ మనకు సహాయము అందజేయుచున్నారు. ఇది మన సత్వర ఆర్థికాభి వృద్ధికి గొప్ప సాధనము.

(5) స్వరాజ్యము ఆర్థికాభివృద్ధికి సాధనమైనప్పుడే సార్థక్యతపొందగలదనే భావము ఇంకొక విధమునకూడ మన తాటస్థ్య విధానమునకు దారితీసింది.

ప్రపంచమందంతట యుద్ధములు లేక, అంతర్జాతీయ వివాదములు శాంతియుతముగ పరిష్కారమగు చున్నప్పుడే మనదేశము ఆర్థికముగా అభివృద్ధికావడము జరుగుతుంది. ఈ కాలములో ప్రపంచమందు యుద్ధము ఎక్కడ ఏ మూరు

మూలలో - ప్రారంభమైనను తుదకు దానిలో అగ్రరాజ్య ములు జోక్యము కలిగించుకొనుటయు, అది ప్రపంచ యుద్ధ ముగ మారుటయు తప్పదు యుద్ధ సన్నాహములలోను యుద్ధములలోను, అగ్రరాజ్యములు వాటి అనుయాయులు, వాటి మూలధనమును సాంకేతిక జ్ఞానమును వినియోగించు కొనవలసి వచ్చినప్పుడు అవి మనకు లభించి మన ఆర్థికాభి వృద్ధికి తోడ్పడుట కల్లయగును. అందుచేత ప్రపంచశాంతిని భంగపరచి యుద్ధమునకు దారితీయు విధానములను మనము వర్జించి, శాంతికి దోహదము కల్పించు విధానమును అనుస రించుట మంచిది. ప్రచ్ఛన్నయుద్ధము చేయుచుండు రెండు కూటములలో ఒకదానియందు మనము ప్రవేశించుట బహి రంగ యుద్ధమునకు దారితీయుటయే. అట్లుగాక, మన తాటస్థ్య విధానము శాంతిని బలపరచగలదిగ నున్నది.

గత పండ్రెండు సంవత్సరములుగ ప్రచ్ఛన్నయుద్ధము గావించుచున్న రెండుకూటములవారు బహిరంగ యుద్ధము ప్రారంభింపకపోవుటకు అనేక కారణము లున్నను మన తాటస్థ్య విధానము ప్రధాన కారణములలో ఒకటి. మనది మిక్కిలి గొప్ప దేశము. మన జనసంఖ్య స్వల్పమైనది కాదు. యుద్ధమునకు కావలసిన సాధన సామగ్రిని తయారుచేయుటకు మన దేశములో అనేక అనుకూలము లున్నవి. ఇదివరకు జరిగిన రెండు ప్రపంచయుద్ధములలో బ్రిటిష్‌వారు ఈ అను కూలములను వినియోగించుకొని విజయము సాధించినారు. ఇట్టి పరిస్థితిలో మనము ఏదియో ఒక కూటములో చేరిన

పక్షమున ఆకూటమునకు ప్రతిపక్ష కూటమునకంటె అనేక రెట్లు అధిక బలము చేకూరగలదు. దానిమూలమున తనకు జయము తప్పక లభించునన్న విశ్వాసముతో అది బహిరంగ యుద్ధములోనికి దిగు ప్రమాదమున్నది. థైలాండు, దక్షిణ వియట్నాం, సింహళము, బర్మా మొదలైన చిన్నచిన్న దేశములు ఏదో ఒక కూటములో చేరుటకును, మనదేశము చేరుటకును ఇందులోనే భేదమున్నది. అందుచేత మన తాటస్థ్య విధానము కొంతవరకు ప్రపంచశాంతికి తోడ్పడి, మనకు కావలసిన ఆర్థికసహాయమును విదేశము లనేకముల నుండి సంపాదించుటలో గొప్ప సాధనము కాగలిగెను.

వైదేశికవిధాన మనగా అంతర్జాతీయ సమస్యలపట్ల మనము వహించు వైఖరి అనియు, ప్రస్తుతకాలమున ఈలాటి సమస్యలలో అంతర్జాతీయ వివాదములను పరిష్కరించుటకు సాధనము యుద్ధమా లేక శాంతియుతమగు సంప్రతింపులా అనునది ఒకటి అనియు, ఇదివరకే చెప్పబడియున్నది. శాంతియుతమగు సంప్రదింపులే దీనికి సాధనమని మన విశ్వాసము. దీని కనుగుణమైన వైదేశికవిధానమును అనుసరించుట మన కర్తవ్యము. తాటస్థ్యవిధానమే అట్టి విధానమని ప్రత్యేకముగ చెప్పవలసినదిలేదు.

ఇది అట్టి విధానమగుటకు మరియొక కారణముకూడ కలదు. రెండుకూటములమధ్య వివాదములు ప్రబలి యుద్ధమునకు దారితీయునప్పుడు వాటిని మధ్యవర్తిత్వముద్వారా రాజీమార్గమును అనుసరించునట్లు చేయగల దేశ మొకటి

ఉండుట అత్యవసరము. మనము తాటస్థ్య విధానమును అనుసరించుటచేత మన దేశము ఈ అవసరమును స్పష్టముగ తీర్చగలది అయ్యెను. సాధారణముగ, ఏ దేశమంటే ఆ దేశము దీనిని తీర్చగల స్థితిలో ఉండజాలదు. దేశము గొప్పదిగాను, ఉభయ పక్షములపట్ల నిష్పక్షపాతముగ ప్రవర్తించగలది యను నమ్మకము సంపాదించినట్టిదిగా ఉన్నప్పుడే దాని మధ్యవర్తిత్వమును రెండు కూటములవారు అంగీకరించుట జరుగును. మనము ఏ కూటములో చేరక, అంతర్జాతీయ విషయములను నిష్పక్షపాతదృష్ట్యా పరిశీలించు చుండిన కారణమున మధ్యవర్తిత్వమును వహించుటకు అర్హులమను నమ్మకము రెండు పక్షములవారికి కలిగెను. అందుచేత అనేక సమయములలో మనము మధ్యవర్తులమై ప్రపంచశాంతికి తోడ్పడగలిగినాము. కొరియా యుద్ధము లోను, ఇండో చైనా యుద్ధములోను మనము ఇట్టి పాత్రను ధరించగలిగినాము.

విస్తీర్ణములోను, జనసంఖ్యలోను, ఆర్థిక వసతులలోను గొప్పదిగ పరిగణింపబడుచుండు మన దేశము తాటస్థ్య విధానమును అనుసరించుటచేత ఆఫ్రికా ఏషియా ఖండములలో మనవలె నూతనముగ స్వాతంత్ర్యమును సంపాదించిన ఇండొనీషియా, బర్మా, సింహళము, ఈజిప్టు, ఘనా మొదలైన రాజ్యములుకూడ ఈ విధానమునే అనుసరించుటకు సిద్ధపడినవి. వాటికి మనము మార్గదర్శుల మైతిమి. దీనిమూలమున ప్రపంచశాంతికి మరింత దోహదము కలుగుటయు, మన

పేరు ప్రతిష్ఠలు మరింత వృద్ధిగాంచుటయు జరిగినది. దేశము యొక్క శ్రేయస్సు వృద్ధియగుట అనగా ధన ధాన్యాలు, సిరి సంపదలు వృద్ధియగుటమాత్రమే కాదు. మనకు ప్రపంచములో ఉండవలసిన పలుకుబడి, నైతిక బలము వృద్ధికావలసి యున్నది. మన రాజ్యాంగవిధాన మందుకు తోడ్పడినది. అందుచేతనే అది మన శ్రేయోభివృద్ధికి సాధనమైనదిగ మనము పరిగణించుట.

(6) మన రాజ్యాంగవిధానము ఇప్పటి అంతర్జాతీయ రంగములో మరియొక విధమునకూడ ప్రాధాన్యము వహించి యున్నది. ప్రపంచములో సామ్రాజ్య తత్వము ఇంకను పూర్తిగ నశించలేదు. వలస విధానమును అనుసరించుచు, ఇతర దేశములను స్వాధీనముచేసుకొన్న దేశములు ఇంకను కొన్ని ఉన్నవి. రెండవ ప్రపంచ యుద్ధము ముగిసినతర్వాత ఏషియాలో ఇండియా, పాకిస్తాన్, బర్మా, సింహాళము, మలయా, ఇండో చైనా, ఇండోనేషియా, ఫిలిప్పైన్సు మొదలైన దేశములకు స్వాతంత్ర్యము లభించినమాట వాస్తవమే. కాని అన్ని దేశములకు వెంటనే స్వాతంత్ర్యము లభించలేదు. ఆఫ్రికాఖండములో ఇప్పుడుకూడ అనేక దేశములు యూరోపియనుల వశమందున్నవి. ఫ్రెంచి పాలనలోని అల్జీరియా పశ్చిమ ఆఫ్రికా ప్రాంతములు; బెల్జియం పాలనలోని కాంగో, బ్రిటిష్ పాలనలోని తూర్పు, మధ్య ఆఫ్రికా దేశములు ; పోర్చుగల్ పాలనలోని దేశములు స్వాతంత్ర్యమునకై పోరాడుచున్నవి. ఇవిగాక రెండవ ప్రపంచయుద్ధ ప్రారంభ

కాలముననూ, దాని తుదిభాగముననూ, అది ముగిసినతర్వాతను యూరపు ఖండములోని ఎస్తోనియా, లాట్వియా, లిథుయేనియా, పోలెండు, తూర్పుజర్మనీ, జెకోస్లొవేకియా, హంగరీ, రుమేనియా, బల్గేరియా, ఆల్బేనియా మొదలైన దేశములను రషియావారు జయించి వాటిపై గొప్ప సామ్రాజ్యాధికారమును వహించి ఇప్పటివరకు పరిపాలించుచున్నారు. ఈ దేశములలో కొన్ని — ప్రధానముగ హంగెరి, తూర్పుజర్మనీ, పోలెండుదేశములు - రషియాపై తిరుగుబాటుచేసి స్వాతంత్ర్యమును సంపాదించుటకు ప్రయత్నములు గావించెను; ఇప్పటికికూడ అట్టి ప్రయత్నములను అవి వదలుకొనలేదు.

పరాయి పరిపాలనమువలన సంభవించు కష్టనష్టములను మన మనుభవించినవారము. ప్రతిదేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్య ముండవలయునని మనము విశ్వసించుచున్నాము. మన వైదేశికవిధానముయొక్క ఉద్దేశ్యములలో ఇట్టి స్వాతంత్ర్యమును సంపాదించుటలో సహాయపడుట ఒక ప్రధానోద్దేశము. ఇది కొనసాగుటయందు తాటస్థ్యవిధాన మెంతో ఉపయోగకరమైన సాధనము.

ఐక్యరాజ్యసమితిలోను, ఇతర అంతర్జాతీయ మహాసభలలోను స్వరాజ్యమునకై పోరాడుచుండు దేశముల పక్షమున నిర్భయముగను, నిస్సంకోచముగను, మనో పరిశుద్ధతతోను వాదించగల దేశములుండుట అవసరము. రెండు కూటములలో చేరిన దేశములేవియు ఈ అవసరమును తీర్చజాలవు. అమెరికా కూటమిలో చేరిన బ్రిటన్, ఫ్రాన్సు

మొదలైనవి రష్యా యొక్క సామ్రాజ్యతత్వమును, విధానమును ఖండించునట్టివేగాని తమ అధీనములోనుండు వలసలమాటను గుర్తించుటలేదు. రషియా కూటములోనివి అమెరికా కూటములోనివారి సామ్రాజ్యవిధానమును ఖండించునట్టివే గాని, సోవియట్ రషియా అనేక దేశములపై సామ్రాజ్యాధిపత్యమును వహించియున్నదనియు, చైనాకు టిబెట్టుపైగల ఆధిపత్యము సామ్రాజ్యాధిపత్యమే అనియు చెప్పుటకు సాహసించుటలేదు. మనదేశము ఇట్టిదికాదు. ఏ కూటములోను మనము చేరని కారణమున రెండుకూటములవారి సామ్రాజ్య తత్వమును ఖండించుచు, సమయము లభించినప్పుడెల్లను వలసదేశముల స్వాతంత్ర్యోద్యమమును సమర్ధించుచు, ఆ ఉద్యమమునకు మనకు సాధ్యమైనంత నైతిక సహాయమును వాక్సహాయమును చేయుచున్నాము. అందుచేతనే ఈ దేశములన్నియు మనయందు గౌరవాభిమానములను కలవిగ ఉన్నవి తాటస్థ్య విధానమును అనుసరించుటవలన మన మూలమున వలసదేశములకు కలిగిన సత్ఫలితములలో ఇది ప్రధానము.

ఇట్లే, దక్షిణ ఆఫ్రికాలోను ఇతర ప్రాంతములలోను శ్వేతజాతులవారు రంగు జాతులవారియెడల గావించు అత్యాచారములను బహిరంగముగ మనము ఖండింపగలుగుటకు కూడ ఈ విధానమే ముఖ్యమైన కారణము.

పై వివరణమువలన తాటస్థ్య విధానము మన కిప్పటి వరకు అనేక ప్రయోజనములను చేకూర్చగలిగినదనియు,

మన భద్రతకు శ్రేయస్సుకు అది ఎక్కువగ తోడ్పడినదనియు అంతర్జాతీయ రంగములో ఉత్పన్నమైన శాంతి సమస్య, వలస సమస్య, జాతి సమస్య మొదలైన సమస్యల పరిష్కారములో అది చాలవరకు తోడ్పడుచున్నదనియు స్పష్టమగుచున్నది.

## కొన్ని ఆక్షేపణలు

కాని ఈ విధానమును ఆక్షేపించువారు లేకపోలేదు. ఎంతటి ఉత్తమమైన విధానముకూడ సర్వజన సమ్మతముగ నుండజాలదు. మచ్చునకు ఈ ఆక్షేపణలలో కొన్నిటినైన పేర్కొనుట అవసరము.

మనదేశము (బ్రిటిష్) కామన్‌వెల్తులో సభ్యత్వము వహించియుండుట ఈ ఆక్షేపణలలో ఒకటి ఈ సభ్యత్వమునకును తాటస్థ్యవిధానమునకును పరస్పర వైరుధ్యమున్నదని వీరి వాదము. తాటస్థ్యవిధానమనగా ఏ కూటములో చేరకుండుట అనియు, కామన్‌వెల్తు ఒక కూటమివంటిదనియు, అందులో సభ్యత్వమువహించుట ఒకకూటములో చేరిపోవుట అనియు, అందుమూలమున మన స్వాతంత్ర్యమునకు భంగం కలుగుచున్నదనియు వీరు ఆక్షేపించుచున్నారు. కాని ఇది సరియైన ఆక్షేపణకాదు. కామన్‌వెల్తు ఒక కూటముకాదు. ఇందులో సభ్యత్వమువహించిన దేశములు (బ్రిటన్, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలెండు, దక్షిణ ఆఫ్రికా, పాకిస్తాన్, మలయ, ఘన, ఇండియా మొదలైనవి) వాటి వ్యవహారము

లను ఇష్టమువచ్చినట్లు నడుపుకొనవచ్చును. ఒకే నిర్ణయమును అనుసరించి అందరు ప్రవర్తించవలెనను నిర్బంధము లేదు. ఇష్టమున్నంతకాలము అవి సభ్యత్వము వహించవచ్చును; ఇష్టములేనియెడల దానిని వదలుకొనవచ్చును. ఇది ఇష్టాగోష్ఠిచేయు ఒక సంస్థ (సమాజము) వంటిది. ఈ సభ్యత్వము మూలమున బ్రిటన్ వంటి దేశములపై మనము ఎక్కువ పలుకుబడిని సంపాదించి, అప్పుడప్పుడు ఉత్పన్నమగు క్లిష్ట అంతర్జాతీయ సమస్యల పరిష్కారములో వాటిని మనవైపు త్రిప్పుకొనగలిగి యున్నాము. తాటస్థ్యవిధానమనగా ఏకాకిగా సన్యాసివలె ఉండుటకాదు. ఇతరులతో సంబంధము పూర్తిగ వదలిపెట్టుకొనుట కాదు. ఈ కారణములన్నిటిచేత మన తాటస్థ్య విధానమునకును కామన్ వెల్తు సభ్యత్వమునకును ఎట్టి పరస్పర వైరుధ్యములేదు. ఐక్యరాజ్యసమితిలో మన సభ్యత్వమెట్టిదో కామన్ వెల్తులో మన సభ్యత్వముకూడ అట్టిదే.

(2) మరికొందరి ఆక్షేపణ ఇంకొకవిధముగ నున్నది. అంతర్జాతీయ సమస్యల గురించి సోవియట్ రష్యా అమెరికాల మధ్యన వాద ప్రతివాదములు సంభవించినప్పుడు మనము తటస్థులుగ నుండుటకు బదులు ఎవరి వాదమునో ఒకరి వాదమును సమర్థించుచునే ఉన్నామనియు, ఇది మన మనుసరించు తాటస్థ్యవిధానమునకు విరుద్ధమనియు వీరి వాదము. ఇదికూడ సమంజసమైన వాదముకాదు. అంతర్జాతీయ రంగములోని వాదోపవాదములలో మనము పాల్గొనక

మన అభిప్రాయమేదియో స్పష్టపరచకపోవుట మన స్వాతంత్ర్యమును కోల్పోవుటయే. ఒక్కొక్కప్పుడు రషియావారి వాదములో న్యాయమున్నట్లు మనకు తోచవచ్చును; మరికొన్ని విషయములలో అమెరికావారి వాదములో న్యాయమున్నట్లు మనకు తోచవచ్చును. అంతమాత్రముచేత మనము మన తాటస్థ్యవిధానమును వదలి, ఆ కూటములోను ఈ కూటములోను చేరుచున్నామని అనుకొనుట పొరపాటు. అంతర్జాతీయ రంగములో బయలుదేరు వాద ప్రతివాదములు ఒక రషియాకుగాని ఒక అమెరికాకుగాని సంబంధించినవి కావు. అవి ప్రపంచమునకంతకు సంబంధించినవి. వాటిని గురించి నిస్సంకోచముగ అభిప్రాయములను వ్యక్తపరచు హక్కు అన్ని దేశములకు ఉన్నది. మనకుకూడ ఉన్నది. ఆ హక్కును నిష్పక్షపాత దృష్టితో ఉపయోగించుట ఏదో ఒక కూటములో చేరినవారికి సాధ్యము అగుటలేదు. మనకు అది సాధ్యమగుచున్నది. ఇదియే మన తాటస్థ్యవిధానములోని సుగుణము.

అనేక అంతర్జాతీయ విషయములలో మనము సోవియట్ వాదముతో ఏకీభవించుచున్నామనియు, అమెరికాతో మనకు ఏకీభావము కుదిరిన విషయములు చాల తక్కువ అనియు, అందుచేత బహిరంగముగ కాకపోయినను ప్రచ్ఛన్నముగ మనము కమ్యూనిస్టు వర్గముపట్ల పక్షపాతము వహించియున్నామనియు ఈ విమర్శకులు కొందరు చెప్పుచుందురు. ఇందులోకూడ సత్యములేదు. వాదములలోని

న్యాయా న్యాయములనుబట్టి మనము వాటిని సమర్థించుటయు సమర్థించకపోవుటయు జరుగుచున్నదే కాని, వాటిని ప్రతి పాదించువారు రషియావారా అమెరికావారా అన్న సూత్ర మునుబట్టి కాదు.

(3) ఈ తాటస్థ్య విధానమువలన మనకు ఎవరుకూడ సన్నిహితమైన మిత్రులు లేనట్టి పరిస్థితి ఏర్పడినదనియు, అందుచేతనే చైనా దేశము పాకిస్తాన్‌పై దురాక్రమణ జరుపు టకుబదులు మనపై దురాక్రమణ జరుపుచున్నదనియు, పాకిస్తాన్ వలె మనముకూడ అమెరికా కూటమిలో చేరియున్న యెడల చైనావారు మనపై దురాక్రమణ సాగించి ఉండ రనియు కొందరు చెప్పుచున్నారు. చైనా దురాక్రమణ ఎందుకు సాగించుచున్నదో స్పష్టమగుటలేదు. మన తాటస్థ్య విధానమే దీనికి కారణమని చెప్పుటకుకూడ బలమైన హేతు వులులేవు. ఈ రెండింటికిని ముడిబెట్టుట అసంగతము.

(4) రెండుకూటములనుండి మనము ఆర్థిక సహాయ మును పొందుచుండుటచేత మనదేశములోనికి రెండు కూట ములకు సంబంధించిన నిపుణులనేకులకు ప్రవేశము కలిగిన దనియు, క్రమక్రమముగ వీరిసంఖ్య హెచ్చి, మనదేశము లోపల రెండువర్గములు బయలుదేరి, మన రాజకీయములను కలుషితము చేయగల పరిస్థితులు ఏర్పడు ప్రమాదము సంభ వింప నున్నదనియు ఏదియో ఒక కూటమునుండి మాత్రమే మనము సహాయమును పొందుచుండు పక్షమున ఇట్టి ప్రమాద మునకు అవకాశము లేకపోవు ననియు చెప్పువారు కొంద

రున్నారు. ఇదికూడ నిరాధారమైన ఆక్షేపణ అని చెప్ప వచ్చును. ప్రస్తుతము మనదేశములోని కర్మాగారములలోను ఇతర ఆర్థిక సంస్థలలోను అమెరికా, బ్రిటన్ మొదలైన పాశ్చాత్య దేశములనుండి వచ్చిన సాంకేతిక నిపుణులనేకు లున్నారు. వీరితోపాటు కమ్యూనిష్టు దేశములనుండి వచ్చిన వారుకూడ అనేకులున్నారు. ఈ నిపుణులు క్రమ క్రమ ముగ రెండువర్గములుగ ఏర్పడి, మనలో విభేదములుకల్పించి మనలను బలహీనులుగజేసి, మన దేశమును తమ తమ పక్షములలోనికి లాగుటకు ప్రయత్నములుగావించి, ఒకప్పుడు ఇంగ్లీషువారికి ఫ్రెంచివారికి మధ్యన యుద్ధరంగమైనట్లు కాల క్రమమున ఈ రెండు వర్గములవారికి మధ్య మనదేశము యుద్ధరంగమగునని పెరు భావించుచున్నారు. ఇదిఅంతయు లేనిపోని భ్రమ.

(5) ఆఖరు ఆక్షేపణ ఇంకొకటి ఉన్నది. దానినే మనము ప్రధానముగ పరిశీలించవలసియున్నది. ఈ ఆక్షేప ణకు ఆధారము, "ఏ విధానముకూడ సర్వకాల సర్వావస్థల యందు అనుసరించ తగినదికా" దనుట. ఒకప్పుడు దేశ భద్రతకు శ్రేయస్సుకు తోడ్పడు విధానము పరిస్థితులు మారి నపుడు తోడ్పడకపోవచ్చును. దేహము బలిష్టముగను ఆరోగ్యవంతముగను ఉండుటకు ఆహారము కావలసియున్నది. కాని చంటి పిల్లలకు ఉపయోగించు ఆహారము వయస్సు వచ్చిన వారికి ఉపయోగించదు. యువకులకు కావలసిన ఆహారమొకటి; వృద్ధులకు కావలసినది ఇంకొకటి. వయస్సుకు

సంబంధించిన పరిస్థితులబట్టి ఆహారములో మార్పు రావలసి
నట్లు మన మెదుర్కొనవలసిన పరిస్థితులలో మార్పులు వచ్చి
నప్పుడు మన వైదేశికవిధానముకూడ మారవలసి ఉన్నది.
గత పండ్రెండు సంవత్సరములలోని పరిస్థితుల దృష్ట్యా
తాటస్థ్య విధానము మనకు లాభకారిగ నుండినను చైనా
దురాక్రమణకాలమున ఏర్పడిన పరిస్థితులలో ఈ విధానము
లాభకారి కాదనియు, దీనిని మనము మార్చుకొనవలసి
ఉన్నదనియు వీరి వాదము. ఇందులోని గుణదోషములను
మనమిప్పుడు విమర్శించవలసి ఉన్నది.



II

# చైనా దురాక్రమణ

చైనా దురాక్రమణ విషయములో కొన్ని ప్రధానాంశములను మనము గుర్తింపవలసి యున్నది.

(1) ఇది సరిహద్దుకు మాత్రము పరిమితమైన దురాక్రమణ కాదు. దీని ఉద్దేశము ఇంతకంటె విశాలతరమైనది. మనము మనదిగ పరిగణించుచుండు సరిహద్దు రేఖలో ఒకటో రెండో గ్రామములను,స్థానములను ఆక్రమించుకొనుఉద్దేశంతో మాత్రము చైనావారు వారి దురాక్రమణను ప్రారంభించి యుండినపక్షమున మనము దానిపైకై విస్తారముగ ఆందోళనపడ వలసినది లేదు. కాని చైనావారి ఉద్దేశ్యము ఇట్టిది కాదు. మన భూభాగమునకు చెందిన 42,000 చదరపుమైళ్ల (ఇటీవల ఇంతకంటె ఎక్కువ విస్తీర్ణముగల ప్రాంతము తమది అని వారి వాదమును పెంచుకొన్నారు) ప్రాంతము తమది అని చూపు పటములను తయారుచేసి, బలప్రయోగము ద్వారా దానినంతను ఆక్రమించుకొనుటకు వారు సిద్ధపడియున్నారు. వారు తయారుచేసిన భూగోళ పటములకు నాలుగైదు సంవత్సరములక్రిందటనే మనము ఆక్షేపణ తెలియపరచినను, ఆ పటములు కమ్యూనిస్టు ప్రభుత్వము ఏర్పడుటకు పూర్వము తయారైనవనియు, అవి అధికారరీత్యా తాము తయారుచేసినవి కావనియు సమాధానముచెప్పి మనలను మభ్యపెట్టుచు

వచ్చిరి. కాని వారిమాటలకును చేతలకును ఎట్టి సంబంధము లేదని ఇప్పుడు మనకు స్పష్టమైనది. ఈ పటముల ననుసరించియే వారు మనదేశముపై దురాక్రమణనుసాగించి ఇప్పటికి 12,000 చదరపు మైళ్ల ప్రాంతమును వశపరచుకొన్నారు. తక్కిన ప్రాంతమును వశపరచుకొనినగాని వారు తృప్తిచెందరనుట వారిచర్యలు చెప్పకనే చెప్పుచున్నవి. ఇంతటి భూభాగమును మనము వదలుకొనుట అన్నివిధములుగ మనకు నష్టము కలిగించును. భూభాగ నష్టమేగాక, దీనిమూలమున మన పేరు ప్రతిష్టలకును, ప్రపంచములో మన మిదివరకు సంపాదించిన గౌరవమునకును ఎక్కడలేని నష్టము సంభవించును.

## చైనా సామ్రాజ్య ధోరణి

(2) చైనావారి దురాక్రమణ 42,000 చదరపుమైళ్ల ప్రాంతమునకే పరిమితమగునట్లు అగుపడుటలేదు. వారి ధోరణి ఇంతకంటె భిన్నముగనున్నది. ఒకప్పుడు చైనావారు విదేశములనేకములను వశపరచుకొని, గొప్ప సామ్రాజ్యమును సంపాదించి, జయించిన దేశములనుండి కప్పములను వసూలు చేయుచుండిరి. ఈ విదేశములలో అనేకములు ఇటీవల స్వాతంత్ర్యమును సంపాదించగలవి అయ్యెను. కాని ఇప్పటి చైనాలోని కమ్యూనిష్టు ప్రభుత్వమువారు ప్రాచీనకాలపు చక్రవర్తులవలె సామ్రాజ్య సంపాదనమందు దీక్షవహించి ఇదివరలో వారి వశమందున్నట్లు చెప్పబడు దేశములన్నిటిని తిరిగి తమ

వశములోనికి తెచ్చుకొని గొప్ప కమ్యూనిష్టుసామ్రాజ్యమున కధినేతలగు సంకల్పముతో నున్నారు. అందుచేతనే వారి దృష్టి నేపాలు, భూటాన్, సిక్కిం అను హిమాలయ రాజ్యములమీదను, బర్మా, థైలాండు, ఇండో చైనాలోని లావోస్ మొదలైన రాజ్యములమీదను ప్రసరించి యున్నది. ఈ దేశములన్నిటిని వశపరచుకొను ధోరణిలో వారున్నారు. ఈ సంకల్పమే నెరవేరిన యెడల (ముఖ్యముగా నేపాలు, భూటాన్, సిక్కిం, బర్మాలోని భూభాగములు వారివశమైన యెడల) మన భద్రతకు, స్వాతంత్ర్యమునకు ఎంతటి ప్రమాదము కలుగునో ప్రత్యేకముగ చెప్పవలసినదిలేదు. టిబెటును వశపరచుకొనిన దాని ఫలితమున లడక్, హిమాలయ ప్రాంతముల ఆక్రమణ వారికి సాధ్యమైనట్లు, నేపాలు మొదలైన హిమాలయ రాజ్యములు వారికి వశమైనయెడల మన దేశములోని గంగా, యమునా మైదానములుకూడ వారి వశమునకు రాగల పరిస్థితు లేర్పడును. తమ జనసంఖ్య 60 కోట్లనియు, తాము తలపెట్టిన కార్యక్రమమును సాధించుటలో నాలుగైదు కోట్ల జనము నష్టమైనను ఖాతరుచేయవలసిన అవసరము లేదనియు వారు భావించుచున్నారు. ఆ కారణముచేత ఇప్పుడు వారు ప్రారంభించిన దురాక్రమణకు మనము అడ్డుపడనియెడల మనకు క్రమేణ రానున్న ప్రమాదము ఇంతింత కాదు. దేశమునుండి బ్రిటిష్ సామ్రాజ్యము తొలగిపోవుటయు దానిస్థానే చైనా సామ్రాజ్యము స్థాపిత మగుటయు జరుగును.

(3) ఈ సందర్భమున చైనాలో ఏర్పడ్డ ప్రభుత్వము కమ్యూనిస్టు ప్రభుత్వ మన్న మాటను మనము సర్వదా జ్ఞాపక ముంచుకొనవలెను. కమ్యూనిజం ఒక మతమువంటిది. ఆ మత మొక్కటే సత్యమైనదనియు, మానవకోటి తరించుటకు అదితప్ప వేరొక సాధనము లేదనియు, ప్రపంచమందంతట దానిని వ్యాపింపజేయుటయే పరమార్థమనియు, ఆ అర్థమును సాధించుటకు ఎట్టి సాధనమునైనను ఉపయోగించవచ్చుననియు కమ్యూనిస్టులందరియొక్క విశ్వాసము. పంచశీల సిద్ధాంతమునకు,సహజీవనసిద్ధాంతమునకు ఇదంతయువిరుద్ధమే కాని చైనావారికి ఈ సిద్ధాంతములలో ఎంతటి శ్రద్ధాభక్తులు ఉండునది వారి దురాక్రమణ కార్యక్రమము స్పష్టపరచియే ఉన్నది. వారిది అవకాశ వాదము. గనుక చైనాలోని కమ్యూనిస్టు ప్రభుత్వముయొక్క ఆశయము వివిధోపాయముల ద్వారా — సామ, దాన, భేద దండములద్వారా — కమ్యూనిస్టు సామ్రాజ్యమును ఏషియా ఖండమందంతట వ్యాపింపజేయుట అను విషయమును మనము మరువరాదు. టిబెట్టును జయించుట ఇందులో మొదటిమెట్టు. ఇండో-చైనాలో ఉత్తర వియట్నాం రాజ్యమును స్థాపించుట రెండవమెట్టు. ఇండియాపై ప్రస్తుతము జరిపించుచుండు దురాక్రమణ మూడవమెట్టు.

## కమ్యూనిష్టు రాజ్యముల అలవాటు

(4) కమ్యూనిస్టు సామ్రాజ్యమును విదేశములలో స్థాపించుటకు కమ్యూనిస్టు రాజ్యములవారు ప్రత్యక్ష బహి

రంగ యుద్ధమునే గాక మరి రెండు సాధనములను ఉపయోగించు అలవాటు గలవారు. సోవియట్ రష్యా, దాని ఉపగ్రహములైన బల్గేరియా, ఆల్బేనియాలు, ఒకప్పుడు యుగోస్లేవియా ఈ సాధనములను ఉపయోగించినవి. ఇప్పుడు కూడ సమయము లభించినయెడల వీటిని ఉపయోగించుటకు సిద్ధముగనున్నవి. ఇందులో మొదటిది విదేశములలో కమ్యూనిజాన్ని ప్రచారము చేయుటకు చారులను పంపుట. ఆ దేశములలోని కమ్యూనిస్టు పార్టీలకు ధనరూపముగను యుద్ధసామగ్రి రూపముగను సహాయముచేయుట. వీటిమూలమున విదేశములలో అల్లరులు బయలుదేరుటయు, అచ్చటి ప్రభుత్వములపై తిరుగుబాటులు జరిగి, అవి తొలగద్రోయబడుటయు, వాటిస్థానే కమ్యూనిస్టు ప్రభుత్వము స్థాపితమగుటయు సంభవించును. ప్రస్తుతము చైనావారు నేపాలులో ఈ సాధనమును ఉపయోగించుచున్నారు. చైనావారిని కొందరిని, టిబెటన్‌లు కొందరిని వారు నేపాలుకు పంపి, అక్కడి ప్రభుత్వమును తొలగద్రోయుటకు ప్రచారము గావించుచున్నారు. నేపాలులోని కమ్యూనిస్టుపార్టీ ఈ అవకాశమును వినియోగించుకొని ఇండియాను దూషించుటకును, నేపాలులో ఇండియాకుగల పలుకుబడి నిర్మూలము చేయుటకును, ఇండియాతో ఒడంబడికలు చేసుకొన్న ప్రభుత్వమును తొలగద్రోసి, చైనాకు అనుకూలమైన ప్రభుత్వమును స్థాపించి, టిబెట్టు స్థితిలోనికి నేపాలును తెచ్చుటకును ప్రయత్నించుచున్నది. టిబెట్టు, ఇతర హిమాలయ ప్రాంతములు చైనావారి వశమగుటచేత ఇట్టి కార్యక్రమము సులభ

తరమగుచున్నది. ఇది క్రమక్రమముగ సిక్కిం, భూటాన్ లకు వ్యాపించగలదు.

## సరిహద్దు ప్రజలలో తిరుగుబాటును ప్రోత్సహించుట

ఈ సందర్భమున కమ్యూనిస్టు ప్రభుత్వము లుపయోగించు రెండవ సాధనము విదేశముల సరిహద్దులలో నివసించు జాతులవారిని వారి ప్రభుత్వముపై తిరుగుబాటు చేయునట్లు ప్రోత్సహించుట. సాధారణముగ ప్రతిదేశపు సరిహద్దులలో పొరుగుదేశములోని జాతులకు సంబంధించినవారు కొందరు తరతరములుగ కాపురములుండుట తప్పదు. నేపాలు, భూటాన్, సిక్కిం, పశ్చిమ బెంగాలు, అసాం లయొక్క ఉత్తర భాగములో టిబెటన్ జాతికి చెందినవా రున్నారు. (ఆంధ్రరాష్ట్రపు సరిహద్దు ప్రాంతములలో ఉత్కళులు, అరవలు, కర్ణాటకులు ఉన్నట్లే). జాతినిబట్టి వీరు టిబెటన్లు కావడముచేత వారు నివసించు భూభాగము టిబెట్టులో చేర వలసియున్నదనియు, అందుకై వారొక ఆందోళనను సాగించి వారి ప్రభుత్వములపై తిరుగుబాటు చేయవలయు ననియు ప్రచారమును చైనావారు రహస్యముగ చేయుచున్నారు. టర్కీ, ఇరాన్, గ్రీసు, మొదలైన రాజ్యముల సరిహద్దులలో ఒకప్పుడు రషియాలోని కమ్యూనిస్టు ప్రభుత్వముకూడ ఇట్టి సాధనమునే ఉపయోగించుచు వచ్చెను.

ఈ రెండు సాధనములమూలమున నేపాలు మొదలైన హిమాలయప్రాంతములు కమ్యూనిస్టు పరిపాలనలోనికి రాగల

ప్రమాదము, తద్వారా వాటిపై చైనా సామ్రాజ్యాధికారము స్థాపింపబడు ప్రమాదము ఎంతో ఉన్నది. ఒకప్పుడు భరతఖండములో భాగముగనుండిన ఆఫ్గనిస్థానము పాకిస్తాన్‌లు వేరైపోయినట్లు ఈ ప్రమాదముమూలమున హిమాలయ పర్వతములు, వాటికి దక్షిణముగనుండు ప్రాంతములు మన దేశమునుండి వేరుపడి చైనాలో కలిసిపోవు పరిస్థితులు పొడసూపుచున్నవి.

## ఈ దుష్టపరిణామము ఇంతటితో ముగియదు

(5) చైనా దురాక్రమణ మూలమున కలుగనున్న దుష్టపరిణామము ఇంతటితో ముగియదు. నేపాలు కమ్యూనిష్టులకు కేంద్రమగుపక్షమున దాని ప్రభావము మన దేశపు రాజకీయములలో ఎంతయో ఎక్కువగ నుండును. ఒకప్పుడు తెలంగాణాను కేంద్రముగ జేసుకొని తద్వారా దేశమందంతట కమ్యూనిష్టు ప్రాబల్యమును వ్యాప్తము చేయుటకు ఇండియాలోని కమ్యూనిష్టుపార్టీవారు ప్రయత్నించిరి. నేపాలు మొదలైన హిమాలయ ప్రాంతములు కమ్యూనిష్టుల పలుకుబడిలోనికి వచ్చినయెడల, ఇండియాలోని కమ్యూనిష్టులకు అవి కేంద్రములు కాగలవు. అచ్చట వారు వారి శిబిరముల నేర్పరచుకొని, వామపక్షములకు కొంత ప్రాబల్యముగల పశ్చిమ బెంగాలులోకి ప్రాకుట సులభతరమగును. చైనాలో కమ్యూనిష్టులు మొట్టమొదట కొన్ని రాష్ట్రములను స్వాధీనపరచుకొని క్రమక్రమముగ దేశమునంతను వశపరచుకొన్న విధానమును ఇండియాలోని కమ్యూనిష్టు లనుసరించుటకు

దీనిమూలమున అవకాశములభించును. దేశములో ఇంతవరకు ఏర్పడిన ప్రజాస్వామ్యమును తొలగద్రోసి, కమ్యూనిస్టు విధానమును స్థాపించుటకిది సాధనమగును.

గనుక పైన ఉదహరించిన అయిదు అంశములవలన చైనా మన సరిహద్దులలో సాగించుచుండు దురాక్రమణ సామాన్యమైనది కాదనియు, దానిమూలమున విపరీతమగు ప్రమాదములు రాగలవనియు, అందుచేత మన దేశమందిప్పుడు ఏర్పడిన పరిస్థితులు గత పండ్రెండు సంవత్సరములుగ నుండిన పరిస్థితులకంటె భిన్నములుగ నున్నవనియు, ఈ పరిస్థితులలో మన వైదేశిక విధానములో కొంత మార్పు అవసరమగుచున్నదనియు స్పష్టమగుచున్నది.



## III

# సంప్రదింపులు, బలప్రయోగము.

ఈ మార్పు ఎట్టిదిగ నుండవలెను? మన మిదవరకు అనుసరించిన తాటస్థ్య విధానమును పూర్తిగ విసర్జించి అమెరికా కూటమిలో జేరిపోవుటయా లేక మధ్యమార్గ మేదైన ఉన్నదా? ఈసందర్భమున మనము గుర్తించవలసిన అంశములు కొన్ని ఉన్నవి.

(1) సంప్రదింపుల ద్వారా మనము చైనాయొక్క వైఖరిని మార్చగలిగినయెడల మనకు ఏ కూటములో చేర వలసిన అవసర ముండదు. మనకును పాకిస్థానమునకు మధ్య పండ్రెండు సంవత్సరములుగనుండిన వివాదములు కొన్నిటిని ఇప్పుడిప్పుడు సంప్రతింపులుద్వారా మనము పరిష్కరించు కొనగలిగినాము. కాని ఈమార్గము ప్రస్తుత పరిస్థితులలో చైనా విషయమున ఉపయోగపడునట్లు కనుపించుటలేదు. చైనా, సంప్రతింపులు తనకు అంగీకారమని ఒకవైపున చెప్పుచూ మరియొకవైపునుండి బలప్రయోగము చేయుచునే యున్నది. ఇదివరలో బలప్రయోగముద్వారా ఆక్రమించిన భూభాగమును వదలివేయుట కిష్టపడకున్నది. తనకున్నంత సైనికబలముగాని, రష్యావంటి అగ్రరాజ్యముయొక్క సహాయముగాని ఇండియాకు లేదన్న కారణమున చైనా సంప్రతింపుల కంగీకరించుటలేదు. మనకుకూడ తమకున్నంత

బలము చేకూరగలదను నమ్మకము చైనా వారికి కుదిరినప్పుడే చైనావారు సంప్రదింపులకు సమ్మతించెదరు. మనము వారితో యుద్ధముచేయుకపోయినను, చేయగల శక్తి వెంటనే సంపాదించగలమనియు, అట్టి సంపాదనములో బలవంతము లైన అమెరికా బ్రిటన్‌లవంటి దేశములు మనకు సహాయపడ గలవనియు వారికి తోచినగాని సంప్రతింపులు సఫలములు కాజాలవు స్పష్టముగాను చట్టరీత్యాను తమ పరిపాలనలోకి రావలసిన ఫార్మోజా ద్వీపముపై దండెత్తి వెళ్ళకుండుటకును తమది కాని మన భూభాగముపై ఆక్రమణ జరుపుటకును ఫార్మోజాను ప్రస్తుతము పాలించుచుండు చైంగేషేకుకు అమెరికావారి సహాయ ముండుటయు, మనకట్టి సహాయము లేకపోవుటయు ఒక ప్రధాన కారణమేమో! ఏ విధముగ నైన మనకు బలముచేకూరువరకు చైనావారు సంప్రదింపుల కంగీకరింపజాలరనుట నిశ్చయము.

## సంప్రదింపులు సాధ్యము కావచ్చును

మనకు బలము చేకూరకపోయినను ఒక సందర్భములో సంప్రదింపులు సాధ్యము కావచ్చును. సోవియట్ రష్యా ప్రభుత్వమువారు ఈ విషయములో ఎక్కువ జోక్యము కలిగించుకొని చైనా ప్రభుత్వముపై ఏదైనా కొంచెము ఒత్తిడి తెచ్చుట కిష్టపడినయెడల చైనావారు సంప్రదింపులకు సమ్మతింతురు. కాని రష్యా ఇట్లు చేయగలదా? అమెరికాతో పది సంవత్సరములుగ జరుగుతున్న ప్రచ్ఛన్న యుద్ధమును

మాని, ప్రపంచ శాంతికి తోడ్పడుటకు రష్యా ప్రధాని క్రుశ్చేవు ప్రస్తుతము గొప్ప ప్రయత్నము చేయుచున్నారు. అట్టి ప్రయత్నము సఫలమగుటలో చైనావారు ఇండియాపై సాగించుచుండు దురాక్రమణ కొంత విఘ్నకారి అనుభావము క్రుశ్చేవుకు కలిగినయెడల ఆ దురాక్రమణను ఉపసంహరించు కొనవలసినట్లు అతడు చైనాకు సలహా ఇయ్యవచ్చు. కాని ఆ సలహాను చైనావారు స్వీకరింతురా? స్వీకరించనిపక్షమున చైనాను బెదరించుటకును, చైనాకు చేయుచుండు సైనిక సహాయమును నిలిపివేయుటకును క్రుశ్చేవు సాహసించునా? ఈ ప్రశ్నలకు ఇదమిద్ధమని జవాబుచెప్పుట సాధ్యముకాదు. బహుశా సాహసింపడేమో? ఒక పరిస్థితిలో అతడీ విషయమున కొంత సాహసము చేయవచ్చును ప్రపంచములో శాంతిని నెలకొల్పుటకు అమెరికా రష్యాలమధ్య ప్రస్తుతము సంప్రదింపులు జరుగుచున్నవి. ఈ శాంతి నెలకొనుటలో యూరపుఖండములో ఉత్పన్నమైన వివాదముల పరిష్కారము మాత్రము చాలదనియు, ఏషియాలో శాంతికి భంగకరముగ పరిణమించుచుండు చైనా దురాక్రమణకూడ ఉపసంహరింప బడవలసి ఉన్నదనియు, అందుకై కృషిచేయుటకు క్రుశ్చేవు సిద్ధపడవలెననియు అమెరికా అధ్యక్షుడు క్రుశ్చేవుకు నచ్చ జెప్పి అతని మనోభావముల మార్పుగలిగిన యెడల చైనా సంప్రదింపులకు అంగీకరించవచ్చును. కాని అమెరికా అధ్యక్షుడు ఇంతటి ప్రమేయము పెట్టుకొనునా? చెప్పుటకు వీలులేదు.

సంప్రదింపుల సాధ్యాసాధ్యములగురించి ఇన్ని సందేహములుండుటచేతనే, శాంతికాముడైన మన ప్రధానికూడ చైనా విషయములో మనము బలప్రయోగము చేయుటకు సిద్ధపడవలసి యున్నదనియు కొంతకాలమునుండి ప్రజలను హెచ్చరించుచుండుట. సంప్రతింపులు సఫలములు కాజాల వన్న ప్రాతిపదికమీదనే మనము మన వైదేశిక విధానమును సరిదిద్దుకొనవలసియున్నది. సంప్రదింపులద్వారా సాధించు కొనలేనిదానిని, సాధించుకొనుటకు బలప్రయోగమే కదా సాధనము. మనవాదము ధర్మసమ్మతముగను న్యాయసమ్మతముగను ఉన్నంతమాత్రమున దానికి విజయము చేకూర జాలదు. ధర్మము జయించవలసియున్నది. కాని అది జయించుటకు కావలసిన బలమును దానితో జోడించినప్పుడే దానికి జయము లభించును. బలసహితముకాని ధర్మము నిలబడజాలదు.

## మన రక్షణ బలములు

(2) చైనా దురాక్రమణను అరికట్టుటకు కావలసినంత రక్షణబలము ప్రస్తుతము మనకు లేదనిచెప్పుట మనకు సత్య దూరము కాదని తోచుచున్నది. కొన్ని సంవత్సరముల వ్యవధి మనకున్నయెడల చైనావారితో తులతూగగల బలమును మనము సమకూర్చుకొనగల మనుటలో ఎలాంటి సందేహములేదు. మన జనసంఖ్య 40 కోట్లు. సైన్యములో చేరదగిన యువకులు లక్షలాదిగ మనలో ఉన్నారు. మన ప్రజలలో శిక్కులు, మహారాష్ట్రులు, రాజపుత్రులు, మొద

లైనవారు యుద్ధములలో ఆరితేరినవారు. తక్కిన జనము కూడ సైన్యములో చేరుటకు వెనుదీయనివారు. కాని తగు శిక్షణపొందిన గొప్పసైన్యము తయారగుటకు కొంతకాలము పట్టును. అపార సైన్యమును తర్ఫీదు చేయుటకేగాక, సైన్యమునకు కావలసిన ఆయుధ సామగ్రిని తయారు చేయగల పరిశ్రమలను, కర్మాగారములను భారీయెత్తున స్థాపించుటకు గూడ వ్యవధికావలసియున్నది. చైనాలో కమ్యూనిష్టు ప్రభుత్వమును స్థాపించుటకు జరిగిన విప్లవమునకును మనదేశములో బ్రిటిష్ సామ్రాజ్యమును తొలగద్రోసి స్వరాజ్యమును స్థాపించుటకు జరిగిన విప్లవమునకును భేదముండుటబట్టియే మొదటినుండి చైనావారివద్ద అత్యధిక సైనికబలముండుటయు మనవద్ద పరిమితమైన సైనికబల ముండుటయు సంభవించినది. ఇదిగాక చైనావారిది నిరంకుశ ప్రభుత్వ మగుటచేతను సైనిక బలమున్న గాని అది నిలబడుటకు సాధ్యము కాని కారణమునను, ప్రాచీనకాలపు సామ్రాజ్యాధికారమును సంపాదించుటయు, ఏషియా ఖండమందంతట కమ్యూనిష్టు విధానమును వ్యాపింపజేయుటయు వారి ఆశయములైన కారణమునను గత పదిసంవత్సరములనుండి వారు వారి సైనిక బలమును వృద్ధిజేసుకొనుటయందు శ్రద్ధవహించిరి. మన ఆశయములు భిన్నములు ఆర్థికాభివృద్ధియందు మన మెక్కువ శ్రద్ధవహించెడివారము. చైనావారివలన ఎట్టి ప్రమాదము సంభవించదని విశ్వసించినవారము. అందుచేత తగుమాత్రం సైనికబలముతో తృప్తిపడియుంటిమి. వారు యుద్ధ సన్నాహములను పూర్తిచేసుకొని దురాక్రమణను ప్రారంభించి

సాగించుచుండువారు. మనమన్ననో, ఈ ప్రమాదమును ఇప్పుడిప్పుడు గుర్తించి యుద్ధసన్నాహమున కిప్పుడిప్పుడు తల పెట్టినవారము. వారు రష్యాకూటములో చేరి, 1949 లో రష్యావారితో సైనిక ఒడంబడికను చేసుకొని కోట్లకొలది రూపాయల విలువగల సైనిక సామగ్రిని సంపాదించినవారు. ఈ పరిస్థితులలో రక్షణ బల విషయమున మనము వారితో తులతూగుటకు కొంతకాలముపట్టును.

## కాలయాపన ప్రమాదకరము

(3) కాని ఈవిషయంలో కాలయాపన ప్రమాదంతో కూడుకొన్నది. మనకు యుద్ధ సామగ్రి వెంటనే కావలసి యున్నది. చైనా దురాక్రమణను వెంటనే అరికట్టనియెడల వారు హిమాలయములకు దక్షిణమందుగల ప్రాంతములను నేపాలు మొదలైన రాజ్యములను వశపరచుకొని మన కపరిమిత నష్టమును కలుగజేయువారగుదురు. అందుచేత మనమిప్పు డెదుర్కొనవలసిన సమస్య ఆయుధ సామగ్రిని వెనువెంటనే వేవేగముగ సంపాదించుట ఎట్లు అనునదే.

మనతోపాటు తాటస్థ్యవిధానము ననుసరించిన ఇండొనీషియా, బర్మా, సింహళము మొదలైన దేశములు సైనిక బలము విషయమున మన ముందుస్థితిలోనే ఉండుటచేత వాటి నుండి యుద్ధ సామగ్రిని సంపాదించలేము. కనుక రష్యా కూటమిలో చేరిన దేశములనుండియో, అమెరికా కూటమిలో చేరినవాటినుండియో మనము మనకు కావలసిన యుద్ధ సామగ్రిని సంపాదించవలసియున్నది.

## విదేశములనుండి యుద్ధసామగ్రి

ఈ రెండింటిలో రష్యాకూటమినుండి సంపాదించుట సాధ్యముకాదు - వాంఛనీయముకూడ కాదు. ఇవన్నియు కమ్యూనిష్టు దేశములు; చైనా మిత్రవర్గములో చేరినవి. చైనా దురాక్రమణను అరికట్టుటకు మనకు కావలసిన యుద్ధ సామగ్రిని వారు సకాలమున మన కందజేయజాలరు. ఇది గాక ఇట్టి దురాక్రమణ వారి అభిమతముగకూడ ఉండ వచ్చును. ఏషియా ఖండమందంతట కమ్యూనిజం వ్యాప్తి గాంచుటకు ఈ దురాక్రమణ సాధనమన్న కారణమున వారు బహిరంగముగ కాకపోయినను ప్రచ్ఛన్నముగ చైనాను సమర్థించువారే. గనుక ఇట్టి విషయములో వారిని నమ్ము కొనుట వెర్రితనము.

ఇందుచేత అమెరికానుండియు, అమెరికాకూటమిలో చేరిన దేశములనుండియు మనము యుద్ధసామగ్రిని సంపాదించ వలసియున్నది. ఇదితప్ప మార్గాంతరమేదియు లేదు. మన కవసరమైన యుద్ధసామగ్రిని మనమే తయారు చేసుకొనగల స్థితిలోకి వచ్చువరకు మనము అమెరికా కూటమిలోని దేశ ములపై ఆధారపడుట అవసరము.

# IV

# విధానములో చేసికొనదగిన మార్పు

మనము అమెరికా కూటములో సభ్యత్వమునవహించిన యెడల ఆ దేశములవారు మనకు కావలసిన యుద్ధ సామగ్రిని అందజేయుదురాఅన్న విషయమును మనమిప్పుడు ఆలోచించ వలసియున్నది.

ఒక కూటములో సభ్యత్వము వహించుట అనగా దానిలోని దేశములకు రక్షణ విషయమై ఏదైన ప్రమాదము సంభవించినప్పుడు వాని రక్షణార్థము మన సేనల పంపుటకును మనకేదైన ప్రమాదము సంభవించునప్పుడు వారి సేనలకు మన దేశములో ప్రవేశము కల్పించుటకున్నూ సిద్ధపడియుండుట. ఇదిగాక రక్షణ విషయములన్నిటిలో కూటమియొక్క సమిష్టి అభిప్రాయము ననుసరించి మనము ప్రవర్తించుట. అనగా కొంతవరకు మన వ్యక్తిత్వమును స్వాతంత్ర్యమును కోల్పో వుట. ఈలాటి షరతులకు అంగీకరించి మనమిదివరకు అనుస రించుచుండిన తాటస్థ్య విధానమును విసర్జించి అమెరికాకూట ములో జేగుటయా అన్న అభిమానము మన ప్రధానిని ఇతర నాయకు లనేకులను బాధించుచున్నది. మనకు గిట్టనివలస విధానము ననుసరించు ఫ్రాన్సు, పోర్చుగల్, బెల్జియం మొద లైన దేశములు చేరియుండు అమెరికా కూటములో చేరుట మన పేరు ప్రతిష్ఠలకు భంగకరమని చెప్పక తప్పదు. కాని

ఇట్లు చేరకపోయినను ప్రత్యేక ఒడంబడికలను చేసుకొని అమెరికానుండియు బ్రిటన్ నుండియు మనము ఆయుధ సామగ్రిని సంపాదించుట కవకాశమున్నది.

## యుద్ధ సామగ్రి కొనుగోలు

ఈలాటి ఒడంబడికలద్వారా తాటస్థ్య విధానము ననుసరించు దేశములనేకములు యుద్ధ సామగ్రి విషయమై వారి అవసరములను తీర్చుకొనుచున్నవి. ఈజిప్టు, సిరియా ఇండోనీషియా, మొదలగు దేశములు రష్యా జెకోస్లావేకియా అమెరికాలనుండి యుద్ధసామగ్రిని సంపాదించు కొన్నవి. మనముకూడ ఈపద్ధతిని అనుసరించవచ్చును. ఇట్టి ఒడంబడి కను అమెరికాతోను, బ్రిటన్ తోను (మరియేదైన దేశము తోను చేసుకొనినయెడల ఆ దేశములవారు మనకు కావలసిన యుద్ధసామగ్రిని మనకు అందజేయుదురు. దాని ఖరీదును వెంటనే కాకపోయినను కొన్ని సంవత్సరములైన తర్వాత మనము వారికి చెల్లించుటకు అంగీకరించవలెను. మన పంచవర్ష ప్రణాళికలలోని పరిశ్రమలు, కర్మాగారములు, ప్రాజెక్టులు మొదలైనవాటి నిర్మాణమునకై మనమిదివరలో విదేశములనుండి కోట్లకొలది విలువగల యంత్ర సామగ్రిని ఇతర పరికరములను అప్పుచేసి తెచ్చుకొనినట్లు ఈ సైనిక ఒడంబడికలద్వారా ఈ సైనిక సామగ్రిని అప్పుచేసి తెచ్చు కొనువారమగుదుము. ఈ రెండు విధములైన ఋణములకు కొంత భేదమున్నది. ప్రాజెక్టులు మొదలైన ఆర్థిక నిర్మాణ ములకు చేయబడు ఋణములు కొంతకాలమునకు మన ఆదా

యమును వృద్ధిచేయునని, వాటిని తీర్చుటకు మనకు కాల క్రమమున అవకాశము లేర్పడును ; అట్టి ఋణములను మనము తప్పక తీర్చగలమను ధైర్యము ఋణదాతలకుండును సైనిక సామగ్రికై చేయబడు ఋణముల విషయమున ఇట్టి నమ్మకము వారికికుదురుట కష్టసాధ్యము. అందుచేత ఆర్థికాభివృద్ధికి ఋణమిచ్చుటకుండునంతటి ఇష్టము సైనిక సామగ్రి విషయములో ఉండజాలదు. ఇదిగాక వారు మన కందజేసిన యుద్ధసామగ్రిని ఇతరులు మనపై చేయు దురాక్రమణను అరికట్టుటకై వినియోగించుటకు బదులు ఇతరులపై దురాక్రమణను సాగించుటకు మనము ఉపయోగించెదమేమో అన్న సందేహము, భయము వారికి ఉండవచ్చును. పాకిస్తాన్‌కు అమెరికావారు అందజేసిన యుద్ధ సామగ్రిని మనపై దురాక్రమణ చేయుటకు పాకిస్తాన్ వారు ఉపయోగించెదరన్న సందేహము మనకు కలిగి, అమెరికా పాకిస్తాన్‌ల మధ్య జరిగిన ఒడంబడికను మనము ఆక్షేపించితిమిగదా? ఇట్లే అమెరికాగాని బ్రిటన్‌గాని మనకు విక్రయించు ఆయుధ సామగ్రిని పాకిస్తాన్‌పైనగాని ఇతర దేశములపైనగాని దురాక్రమణ చేయుటకు మనము వినియోగించెదమేమో అన్న సందేహము ఆ దేశములకు కలుగుటలో ఆశ్చర్యములేదు. అట్టి సందేహమునకు ఆస్పదము లేదనియు, వారు మనకిచ్చు యుద్ధ సామగ్రిని మన దేశరక్షణకును చైనా దురాక్రమణను అరికట్టుటకు మాత్రమే వినియోగ పరచెదమనియు వారికి నమ్మకము కలిగించవలసి యున్నది. అప్పుడు వారు వారి

కూటములో మనము చేరకపోయినను సైనిక సామగ్రిని అందజేయగలరు.

ఒకదృష్ట్యా బ్రిటన్ విషయములో మనకు ఏలాటి చిక్కులు ఉండజాలవు. కామన్‌వెల్తులో మనకు సభ్యత్వ మున్నది. బ్రిటన్‌నుండి సైనిక సహాయమును సంపాదించుట కామన్‌వెల్తులోని ఒక సభ్యత్వదేశము మరియొక సభ్యత్వ దేశమునుండి సహాయము పొందుటయే. ఏదియో ఒక కూటములో ప్రత్యేకముగ చేరుటయా చేరకపోవుటయా అన్న ప్రశంస బయలుదేరుటకే వీలులేదు. మనకు కావలసిన సామగ్రి అంతయు బ్రిటన్‌నుండి లభించినయెడల ఏలాటి క్లిష్టసమస్యలను మనము క్రొత్తగా ఎదుర్కొనవలసి యుండదు. కాని మనకు కావలసిన సామగ్రి అంతయు బ్రిటన్ ఇయ్యగల స్థితిలోలేదు. అమెరికాయొక్క సహాయము చాలఅవసరము. అందుచేత సైనిక సామగ్రి విషయమై అమెరికాతో ప్రత్యేక ఒడంబడిక చేసుకొనవలసి యున్నది.

అమెరికావారు సులభముగ ఇట్టి ఒడంబడికను అంగీక రింతురా? తమ కూటములో చేరినగాని తామిట్టి సహాయ మును చేయమని పట్టుబట్టరా? తమసహాయములేక చైనాను ఎదుర్కొనుట మనకు సాధ్యము కాదన్న విషయమును గ్రహించి, వారు మనలను ఒత్తిడిచేసి వారి కూటములో చేర్చుకొనుటకు ప్రయత్నముచేయరా? అన్న సందేహము ఈ సందర్భములో మనలో అనేకులకు కలుగక తప్పదు. కానిదీనికి ప్రస్తుతము ఎక్కువ ఆధారములేదు. ఈ సందర్భ

ములో రెండు మూడు విషయములను మనము గుర్తించవలెను.

## అమెరికా వైఖరిలో మార్పు

ఒకప్పుడు అమెరికావారు మన తాటస్థ్యవిధానమును నిరసించి మనయెడల ఎక్కువ సుముఖత్వమును చూపకుండిరి. కాని గత రెండు మూడు సంవత్సరములుగ వారు వారి వైఖరిని మార్చుకొనిరి. మనవిధానము సహేతుకమైనదనియు తాటస్థ్య విధానమును అనుసరించిన మాత్రముచేత మనము ప్రజాస్వామ్య సిద్ధాంతములను నిరాకరించి కమ్యూనిజాన్ని సమర్థించుట లేదనియు వారు గ్రహించి మనకు కావలసిన ఆర్థిక సహాయమును మరింత ఉత్సాహముతో చేయుచున్నారు. తాటస్థ్య విధానమును మనము మార్చుకొనవలెనను అభిప్రాయముపై వారికిదివరకున్న పట్టుదల తగ్గిపోయెను.

ఇదిగాక రష్యాతో వారు సాగించుచున్న ప్రచ్ఛన్న యుద్ధముయొక్క తీవ్రత ఇటీవల చాలవరకు తగ్గినది. రెండు దేశములవారు సహజీవన సిద్ధాంతమును మనస్ఫూర్తిగ ననుసరించదలచియున్నారు. ప్రచ్ఛన్న యుద్ధము తీవ్రరూపము ధరించియుండిన కాలములో వారు మన తాటస్థ్యవిధానమును అపార్థము చేసుకొని ఖండించుచు వచ్చిరి. కాని ఇప్పటి పరిస్థితి వేరు. మనము వారి కూటములో చేరవలసిన అగత్యము వారికిప్పుడు లేదు.

ఇంతకంటె ప్రధాన విషయ మింకొకటి ఈ సందర్భములో గుర్తించవలసి ఉన్నది.

## కమ్యూనిజంపై 'యుద్ధం'

అమెరికావారికి కమ్యూనిజం ఎంతమాత్రము గిట్టదు. దాని వ్యాప్తిని అరికట్టు ఉద్దేశముతోడనే వారు గత పండ్రెండు సంవత్సరములుగ వారి వైదేశిక విధానమును సాగించిరి. ఆ వ్యాప్తికంతకు రష్యా ప్రభుత్వమే కారణమని వారిదివరలో నిశ్చయించుకొని, రష్యాయొక్క సామ్రాజ్యోద్యమమును నిరోధించుటకు వారి బలమునంతను వినియోగించిరి. కాని స్టాలిన్ మరణానంతరము రష్యాలో జరుగుచుండు పరిణామములదృష్ట్యా, రష్యానుగురించి వారికిదివరకు ఉండిన అభిప్రాయమును చాలవరకు మార్చుకొనుచున్నారు. రష్యామూలమున కమ్యూనిజం ప్రపంచమంతటా వ్యాపించు ప్రమాదము తగ్గినదనియు, ఈ విషయములో రష్యా స్థానమును చైనావారు ఆక్రమించినారనియు, ఇక మీదట కమ్యూనిజం వ్యాప్తి అంతయు చైనా అధ్వర్యమున జరుగనున్నదనియు, ఆ వ్యాప్తికి ఇండియా మొదలైన దక్షిణ ఏషియాలోని దేశములు గురియగుచున్నవనియు అమెరికా వారి అభిప్రాయము. ఏవిధముగనైనను చైనావారి సామ్రాజ్యోద్యమమును ఎదుర్కొనుటకు వారు నిశ్చయించుకొనియున్నారు. ఇప్పటి పరిస్థితులలో తగిన సహాయమును సకాలమున ఇండియాకు చేయనిపక్షమున చైనాలో పది

సంవత్సరముల క్రిందటి చైంకేషేక్ ప్రభుత్వము పతనమై కమ్యూనిష్టు ప్రభుత్వము స్థాపింపబడినట్లు ఇండియాలో ప్రజాస్వామ్యవిధానము కూలిపోయి కమ్యూనిష్టు ప్రభుత్వము స్థాపింపబడు ప్రమాదమున్నదని వారు విశ్వసించియున్నారు. ఇట్టి మార్పు ఇండియాలో జరిగినపక్షమున బర్మా, మలయా, థైలాండు, ఇండో - చైనా, ఇండోనీషియాలతో కూడిన ఆగ్నేయ ఏషియా అంతయు కమ్యూనిస్టు పాలనలోనికి రాకతప్పదని వారి అభిప్రాయము. వారేగాక బ్రిటన్, ఆస్ట్రేలియా మొదలైన దేశములవారుకూడ ఇట్టి అభిప్రాయమునే కలిగియున్నారు ఈలాటి వాతావరణములో ఇండియా అమెరికా వారి కూటములో చేరకపోయినను ఇండియాకు కావలసిన సైనిక పరికర సహాయమును అమెరికావారు చేయగలరు.

## తాటస్థ్యవిధాన పునః పరిశీలన

ఈ వివరణమంతనుబట్టి తేలిన సారమేదియో మన కిప్పుడు స్పష్టమగుచున్నది. చైనా గావించుచుండు దురాక్రమణ ఫలితముగ మన మిదివరకు అనుసరించుచుండిన తాటస్థ్య దైశికవిధానములోని గుణదోషములను పునర్విమర్శించుకోవలసిన సమయము వచ్చినది. చైనాయొక్క శత్రుత్వము పాకిస్థాన్ శత్రుత్వము వంటిది కాదు. ఇది బహుబలవంతమైన దేశము యొక్క శత్రుత్వము. దానినెదుర్కొనుటకు కావలసినంత రక్షణబలము మనకు ప్రస్తుతము చాలి

వంత లేదు. ఆబలమును మనము వెంటనే సమకూర్చుకొనవలసి ఉన్నది మన దేశములో జనసంఖ్య అతిబాహుళ్యముగ నుండుటచేత, సైనిక సంఖ్యను బలపరచుకొనుటలో ఇతరుల సహాయమును మన మపేక్షించవలసినది లేదు. కాని సైనిక పరికరములను సంపాదించుటలో ఇట్టి సహాయము అవసర మగుచున్నది. దానికిగాను అమెరికా, బ్రిటన్ లతో ప్రత్యేక ఒడంబడిక చేసుకొనుటతప్ప మార్గాంతరము లేదు.

ఇట్టి ఒడంబడికచేసుకొనుటలో మనము మన తాటస్థ్య విధానమును వదలి అమెరికా కూటమిలో చేరవలసినది లేదు. అట్లు చేరకపోయినను ఇట్టి ఒడంబడిక సాధ్యము కాగలదు. ఇది ఒక సైనిక పరికరములకు మాత్రమే పరిమితమైనది.

చైనా దురాక్రమణ నుండి మన దేశమును మన స్వాతంత్ర్యమును రక్షించుకొనుటకై మనము చేయవలసిన పనులలో ఇది మొదటిది. వెంటనే జరగవలసినది. ఇది గాక, ఈ సందర్భములో మనము చేయవలసిన పనులు ఎన్నో వున్నవి. వీటిలో కొన్ని మన వైదేశికవిధానమునకు సంబంధించినవి. మరికొన్ని మన ఆంతరంగిక వ్యవహారములకు సంబంధించినవి.

వైదేశిక విధానమునకు సంబంధించిన పనులలో పాకిస్థాన్ తోటి మనకుత్పన్నమైన వివాదముల నన్నిటిని పరిష్కరించుకొనుట మొదటిది. ఈ వివాదము లున్నంత వరకు మన సైనిక బలమును సంపూర్ణముగ చైనా వారి

నెదుర్కొనుటలో మన ముపయోగించుకొన లేము. కొంత బలమును పాకిస్తాన్ సరిహద్దులలో నుంచుట తప్పదు. అట్లు గాక ఈ వివాదములు పరిష్కారమైనయెడల పాకిస్థాన్ మూల మున మన కెట్టి ప్రమాదములు రాజాలవన్న నమ్మకము కలవారమై మన సైనిక బలమునంతను చైనాను ఎదుర్కొను టకై వినియోగించుకొన్నవార మగుదుము.

వైదేశిక విధానమునకు సంబంధించి చేయవలసిన పని మరియొకటి కలదు. చైనా దురాక్రమణకు మనమే గాక మనతోబాటు బర్మా, మలయా, థైలాండు, ఇండోనేషియా దేశములు కూడ గురియైయున్నవి. ఈ దేశములతో మనము సన్నిహిత సంబంధములను ఏర్పరచుకొనుట అవసరము. దీనిని తీర్చుకొనుటయే రెండవ పని. ఈదేశములు మనతో చేరకుండునట్లు చైనావారు అనేక పన్నాగములను పన్నుచు న్నారు. ఆ పన్నాగములలోని దురుద్దేశములను మనము గ్రహించి, వాటికి విఘాతము కలిగించి, ఆ దేశములతో మనము దగ్గరి సంబంధముల కల్పించుకొనవలెను.

మన ఆంతరంగిక వ్యవహారములకు సంబంధించిన పను లలో రెండు ముఖ్యములైనవి. ఒకటి దేశములోని ప్రజ లందరిలో జాతీయ భావమును బలపరచుట, ఇంతకుపూర్వము విదేశములవారు - మహమ్మదీయులు, ఆంగ్లేయులు మొద లైనవారు - మన దేశమును జయించుటకు ప్రధానకారణము మనలో ఐకమత్యము లేకపోవుటయు, మనలో కొందరు శత్రుపక్షము చేరుటయు, ఇప్పుడుకూడ ఇట్టివారు దేశములో

ఉన్నారు. వారెవరో తెలుసుకొని అట్టివారివలన మనకు ప్రమాదము లేకుండ మనము చర్యలు తీసుకొనవలెను.

ఈ సందర్భములో మనము చేయవలసిన రెండవపని మన సైనిక బలమును, సైనిక పరికరములను ఉత్పత్తి చేయ గల భారీ పరిశ్రమలను వృద్ధిచేసుకొనుట. పారిశ్రామికముగ వెనుకబడిన దేశములు రక్షణ విషయమున కూడ వెనుకబడి యుండుట తప్పదు. ఈ లోపమును మనము సత్వరముగ పూరించుకొనవలెను.

ప్రస్తుతము మనదేశ చరిత్రలో నూతనఘట్ట మొకటి ప్రారంభమైనది. అనాదిగ మన స్వాతంత్ర్యమును రక్షించు చుండిన హిమాలయ పర్వతములు మనలను రక్షించలేని స్థితి లోనికి వచ్చినవి. బలిష్ఠమైన రాజ్యమొకటి మనకు శత్రు వైనది. ఈ శత్రుత్వము తాత్కాలిక మైనది గాక దీర్ఘకా లికమైనట్టిది. రక్షణ విషయములో మన బాధ్యతలు హెచ్చి నవి. దేశములోని వారందరు దీనిని గ్రహించి, నడుము కట్టుకొని, ఐకమత్యముతో ఏకధాటిగ పని చేయవలసిన సమయము వచ్చినది.

# విజ్ఞాన వికాసానికి

కొనండి : చదవండి ॥

## ఆచార్య శ్రీ మామిడిపూడి వేంకటరంగయ్యగారి

| | | |
|---|---|---|
| 1) | సమాధానవేదిక | 1-12 న. పై. |
| 2) | మన జాతీయ జీవిత పునర్నిర్మాణము విద్యార్థుల కర్తవ్యము | 0-60 న. పై. |
| 3) | భారత రాజకీయాలు | 0-60 న. పై. |
| 4) | మన వైదేశిక విధానము | 0-60 న. పై. |
| 5) | పాశ్చాత్య రాజ్యాంగ తత్వము (అచ్చులో) | 1-50 న. పై. |

ప్రతులకు :

తెలుగు విద్యార్థి ప్రచురణలు

మచిలీపట్నం.

# Mana Vydesika Vidhanamu

By

**Prof. M. Venkatarangaiah** M. A.,

**Telugu Vidyardhi Prachuranalu**

**Masulipatam.**